# సర్వార్థ సంక్షేమ సమితి,

501, ప్రదీప్ అపార్ట్‌మెంట్, గాంధీనగర్, హైదరాబాద్ - 380.

*సభ్యులుగా చేరండి - ధార్మిక సేవలో పాల్గొనండి*

| | | సర్వార్థ సంక్షేమ సమితి సభ్యత్వవివరములు | విశ్వప్రకాశం సభ్యత్వవివరములు |
|---|---|---|---|
| 1 | మహారాజపోషకులు | రు. 1,00,000-00 | రు. 15,000-00 |
| 2 | రాజపోషకులు | రు. 50,000-00 | రు. 10,000-00 |
| 3 | పోషకులు | రు 25,000-00 | రు. 5,000-00 |
| 4. | కార్యనిర్వాహక సభ్యత్వము | రు. 10,000-00 | - |
| 5 | శాశ్వత సభ్యత్వము | రు. 1,000-00 | రు. 1,000-00 |
| 6 | వార్షిక సభ్యత్వము | రు 100-00 | రు. 60-00 |
| 7 | ద్వివార్షిక సభ్యత్వము | | రు. 120-00 |
| 8. | విడి ప్రతి | | రు. 5-00 |

పై సభ్యత్వములకు చెక్కు లేదా డి.డి. ద్వారా లేదా నగదు రూపకంగాను స్వీకరించబడును. మరియు 80 G ఇన్‌కంటాక్సు లబ్ధి పొందవీలగును.

*విశ్వప్రకాశం ధార్మిక మాసపత్రికకు*
*ప్రకటనలు పంపండి, ప్రోత్సహించండి*

## పత్రికా ప్రకటన వివరములు

| | | |
|---|---|---|
| 1. | వెనుక కవరు పేజీ | రు.2,500-00 |
| 2. | రెండవ కవరు పేజీ | రు.1,500-00 |
| 3 | మూడవ కవరు పేజీ | రు 1,500-00 |
| 4. | లోపలి పూర్తి పేజీ | రు. 500-00 |
| 5 | 12 మాసాలకు 12 సంచికలకు చిన్నసైజులో | రు.2,500-00 |

# విశ్వప్రకాశం

జూన్ సంచిక | జూన్ 1998

సంపుటి : 4 సంచిక : 7 వెల రూ. 5-00



*ప్రకాశకులు :*
సర్వార్థ సంక్షేమ సమితి
501, ప్రదీప్ అపార్ట్‌మెంట్స్,
గాంధీనగర్, హైదరాబాద్ - 500 080

*ఇందులో ........* *పుట*



*ముఖచిత్రం :*
షిరిడీ సాయిబాబా

సంపాదకీయం

# భారతదేశపు కుటుంబవ్యవస్థ

భారతదేశపు కుటుంబవ్యవస్థ తక్కిన అన్ని వ్యవస్థలకు మాదిరిగానే అవస్థలకు గురి అయింది. గ్రామీణ వ్యవస్థకు వీడ్కోలు చెప్పటంతో పారిశ్రామికీకరణం, నగరీకరణం అనివార్యమైనాయి వ్యవసాయ నాగరకత పారిశ్రామిక నాగరకతగా పరిణామం చెందుతున్న సంధిదశలో ఆర్థికమైన విలువలు మారిపోయినాయి. ఉమ్మడి కుటుంబం కుప్పకూలిపోయింది. శాస్త్రవిజ్ఞానం కొత్త విలువలను సంతరించినా సామాన్య జనులకు కొత్త జీవన ప్రమాణాలను, కొత్త విలువలను సమకూర్చలేకపోయింది.

పాతవిలువలు నిరాకృతమైనాయి. కొత్త విలువలతో సమాధానం కాని సమన్వయం కాని కుదుర్చుకోలేని దురవస్థ కొనసాగుతూనే ఉంది. ఇంగ్లీషులో 'ట్రాజెడీ' అనే మాటకు మలయాళంలో సమానార్థకమైన పదం 'దురవస్థ' అనేది. ఇప్పుడు సామాజికంగా సామాన్య మధ్యతరగతి కుటుంబవ్యవస్థ ఈ దురవస్థ నెదుర్కొంటున్నది. కులవ్యవస్థను సమర్థించాల్సిన అవసరం లేకపోయినా సామాజిక పరిణామక్రమంలో అది కొంత కట్టుబాటును, పరిరక్షణను కల్పించింది. అది దుర్వినియోగం కావడంతో దానిపట్ల అనభిముఖ్యం కలగడం సహజమే కాని అది పూర్తిగా విచ్ఛిన్నం కాలేదు. పూర్తిగా నిరాకృతం కావడానికి అభిముఖ్యమూ బలం పుంజుకోవడంలేదు. కాబట్టి సంఘర్షణ తప్పడంలేదు. కాగా రాజకీయాలు భారతదేశంలో తరతరాలుగా వ్రేళ్ళూనిన ఈ కులవ్యవస్థను మరింత కలుషితం చేస్తున్నాయి. అధికశాతం సామాన్యప్రజానీకంలో విద్యావివేకాలు లేకపోవటంతో దురాశాపరులు, దుష్టరాజకీయ నాయకులు భారతదేశ సామాజిక వ్యవస్థతో ఆడుకుంటూ తమ పబ్బం గడుపుకుంటున్నారు.

పల్లెటూరి సామాజిక వ్యవస్థనుంచి అన్ని కులాల, కుటుంబాల నగరీకరణ వలసలు ఈ శతాబ్ది ప్రారంభానికే మొదలైనాయి. ఉద్యోగాసక్తి హెచ్చింది సమాజంలో. అది వినాసుఖ జీవనోపాయం సాధ్యంకాదు అనే నమ్మకం క్రమంగా బలపడుతూ వచ్చింది సమాజంలో పల్లెటూరిలో అనివారణీయమైన ఉమ్మడి బాధ్యత, ఉమ్మడి ప్రయోజనాకాంక్ష, నగరజీవనాకాంక్షా పరిణామక్రమంలో అనుకోని ఫలితాలను

తెచ్చిపెట్టాయి. కులకక్షలు, కులకార్పణ్యాలు, కులాభిమానాలు (మంచి చేసే విధంగాకాదు, చెరుపుచేసే విధంగా) తలయెత్తుతూ దానికి అధికార వ్యామోహ రాజకీయాలు తోడుకాగా సమాజ జీవనంలో కలుషచిత్త వృత్తులకు అదుపు తప్పిపోతున్నది.

వృత్తి విద్యలు నశించి, వాటి ప్రయోజనం ప్రశ్నార్థకమై, ఉద్యోగవ్యామోహమే పురుషార్థమైపోయిన ప్రవృత్తి ప్రబలంగా దాని ప్రభావం కుటుంబపు కుదురుపైకూడా ప్రసరించింది. స్వార్థం, సుఖజీవనాభిలాష, త్వరితగతి సంపన్నతపట్ల అమితప్రీతి, ఆదరణీయ సౌముఖ్యం వేగంగా విస్తరించాయి.

గ్రామీణ జీవనవ్యవస్థలో కుటుంబంలో సుఖంగాని దుఃఖం గాని పదిమందీ పంచుకునేవారు. పదిమందిపై ఆధారపడుఉండేది. పదిమందీ కనుగలిగి ఉండేవారు. ఊరి చెరువు కలుషితమైతే ఊరంతకూ నీటి సమస్యేకదా. నగరంలో అయితే వాతావరణ కాలుష్య సమస్య ఏర్పడినా, నిత్యజీవితావసరాల అసౌకర్యం పెరిగిపోతున్నా నియంత్రణ సామాజిక బాధ్యతకాదు. సామాజికుల చేతిలోలేదు. తాను వేరొక ద్వీపంగా బతకవలసివస్తున్నది సగటుమనిషి. కుటుంబంపైకూడా ఈ ఫలితం నాగజెముడులా అల్లుకొంటున్నది.

భారతదేశంలో సరి అయిన గుర్తింపులేక, ఉద్యోగావకాశాలు లేక, ప్రోత్సాహంలేక, వివక్షకు గురిఅవుతూ, రిజర్వేషన్‌ల దుష్పరిణామాలను అనుభవిస్తూ చొరవ, సాహసం, పట్టుదల, చురుకుతనం గల తరుణీ తరుణులు విదేశాలకు వెళుతున్నారు. సగౌరవమైన ఉపాధిని వెదుక్కుంటూ కొంతమంది వేరే గత్యంతరంలేక వెళుతున్నారు. దీనితో కుటుంబజీవితం బీటలువారుతున్నది. అక్కా, అన్నా, చెల్లీ, తమ్ముడూ ఏళ్ళ తరబడి వేరువేరుగా ఉంటున్నారు. తల్లిదండ్రులతో సంతానానికుండవలసిన దృఢతమ బంధం శిథిలమవుతున్నది. పిల్లలు పెద్దవాళ్ళైనకొద్దీ తల్లిదండ్రులు వృద్ధులు కావడం సహజమేకదా!

అందువల్ల వృద్ధాశ్రమాల ఆవశ్యకత ఎక్కువవుతున్నది. తరవాత తరంవారితో సంబంధాలు తెగిపోతున్నాయి. మనవణ్ణి వొళ్ళో ఉంచుకుని, తలమీదికి ఎక్కించుకొని, పక్కలో పడుకోబెట్టుకుని ఏ శ్లోకమో, పద్యమో, కథో, ముచ్చటో ఆడుకుని

భావోద్వేగప్రశమనం చేసుకునేందుకు, ప్రేమను ఉత్కంఠతో ప్రసరింపచేసుకునేందుకు తాతలకిప్పుడు ఆదృష్టంలేదు. బామ్మలకిప్పుడు పిల్లల పిల్లలను చేరదీయడం శశవిషాణ సంపాదనమే. పిల్లలు ఎక్కువ సంఖ్యలో విదేశాలకువెళుతుండటం అక్కడే స్థిరపడిపోతామని బెదిరించడాలతో మధ్యతరగతి కుటుంబాలలో మానసికోద్వేగాలు ఎక్కువవుతున్నాయి. 'మధ్య'తరగతి కుటుంబీకులకు ఫరవాలేదు. వాళ్ళు సమాజంలో పైస్థాయిలో ఉంటారు.

మానసిక సంఘర్షణలు, ఉద్వేగాలవల్లనే శాంతిభద్రతలు సంఘంలో కరువవుతున్నాయి. టి.వి. కార్యక్రమాలు, సినిమాలు యువతను, మానసిక పరిపక్వస్థాయిలేని కౌమారదశీయులను భ్రష్టుపట్టిస్తున్నాయి. కేవలం సులభంగా తొందరగా ఎక్కువ డబ్బు కొల్లగొట్టుకోవాలని సినిమాలు నీతినియమాలు నిబంధనలూ తుంగలో తొక్కుతున్నాయి. సామాజిక భద్రత భావానికి నీళ్ళొదులుతున్నాయి

ప్రతి కుటుంబంలోనూ ఏదో ఒక బాధ, ఏదో ఒక అశాంతి, ఏదో ఒక ఆపద. మాకేమీ సమస్యలు లేవు అనే కుటుంబం ఒక్కటీ కనపడదు. కుటుంబసభ్యులమధ్యనే అప్యాయతలు, ఆదరణలు, నైతికబాధ్యతలు, కలివిడితనం ఉండటంలేదు. ఈర్ష్యా అసూయలు మాత్సర్యం చోటు చేసుకుంటున్నాయి. కారణం స్వార్థపరత్వం. సమాజంలో కృత్రిమమైన హోదాపట్ల మోజు. ఆడంబర జీవితంపట్ల అభిలాష. తమను అందరూ గొప్పవారనుకోవాలనే గొంతెమ్మ కోర్కెలు ఇదివరలో వీటి పొంతబోనివారిని కూడా ఆకర్షిస్తున్నాయి. ఇంకా ఇంకా సౌకర్యాలు కావాలి. ఇంకా ఇంకా డబ్బు చేకూరాలి అన్న ఆత్రుత కుటుంబ జీవితాన్ని విచ్ఛిన్నం చేస్తుంది. పరిమిత కుటుంబాలవల్ల కూడా సామాజిక స్వస్థతకు అభిలషించిన మేలు కలుగదు. కిందటితరంలో ఐదార్గురు పిల్లలున్నా లేని ఇబ్బందులు ఇప్పుడు ఒక్కరితోనో ఇద్దరితోనో కలగటానికి కారణాలేమిటి? వృద్ధులు నిరాశ్రయులు కావడం ఎందుకు? అన్నదమ్ములలోనైనా ప్రేమాభిమానాల అవగాహనలు ఎందుకు కొరవడుతున్నాయి? కుటుంబం వొద్దికగా ఉంటేకదా సమాజమూ, దేశమూ ఉద్వేగ రహితంగా ఉండేది!

# శ్రీ దత్తమహిమ

*శ్రీ పోత్రాప్రగడ వెంకటసుబ్బారావు*

ఓం నమోభగవతే దత్తాత్రేయాయ

భగవంతుడు సచ్చిదానందస్వరూపుడు. శాంతికి నిధానము. భగవదనుగ్రహమువలననే శాంతిలభించును. ఇంకొక మార్గములేదు.

విష్ణుమూర్తిని "శాంతాకారం భుజగశయనం" అని, శివుని "శాంతం, పద్మాసనస్థం" అని దత్తాత్రేయుని "దత్తాత్రేయం శివం శాంతం" అని శ్రీ చక్రమధ్య బిందువునందు మహాత్రిపురసుందరిని "శాంతి రసాత్మిక" అని మనము ధ్యానింతుము. ప్రభుత్వములు ప్రజలు ఆస్తికులు నాస్తికులు అందరు శాంతి సుఖమునే అభిలషింతురు. శాంతినెలకొల్పుటకు అనేక ప్రణాళికలనేర్పాటు చేయుదురు. కాని ఫలితము? అసూయాద్వేషములతో వైరమును పెంచుకొని జాత్యహంకారములతో కులతత్త్వాలతో మతమౌఢ్యములతో శాంతికి దూరమగుచున్నారు. కారణము?

వ్యక్తుల మనస్సులనావరించి ఎనిమిది ఆవరణ శక్తులున్నవని, వీటిని జయించుట దైవీ సంపత్తిలేనిచో సాధ్యపడదని శాస్త్రములు చెప్పుచున్నవి.

"కామఃక్రోధోస్తథాలోభోమదో మోహశ్చపంచమః
మాత్సర్యం షష్ఠమిత్యాహుః పైశాన్యం సప్తమంతథా

అసూయాత్వష్టమిజ్ఞేయా ఇత్యేతా అష్టమాతరః" అని వరాహ పురాణము. ఈ యెనిమిది ఆవరణశక్తులే శాంతికి ప్రబల ప్రతిబంధకములుగానున్నవి. ఈ శక్తుల సమష్టి పరిణామమే 'అసూయ'. అసూయ సర్వసంసార సంక్షోభములకు మూలకారణము.

పై విషయమునే ప్రహ్లాదుడు తన తండ్రి హిరణ్యకశిపునకు వినయావనతుడై తెల్పెను.

"లోకములన్నియున్ గడియలోన జయించినవాడవింద్రియా
నీకము చిత్తమున్ గెలువనేరవు నిన్ను నిబద్ధుచేయునీ
భీకర శత్రులార్వురప్రభిన్నుల చేసిన బ్రాణికోటిలో
నీకు విరోధిలేడొకడు నేర్పున జూడుము దానవేశ్వరా!"

అసూయారహితమగు మనసుగల సాధ్వి అనసూయ. మహామహిమాన్విత. "ఆధ్యాత్మికాది తాపత్రయ రహితత్వేన అత్రిశబ్దవాచ్యో జీవన్ముక్తోకశ్చిన్మహర్షిః" అని అత్రి శబ్ద నిర్వచనము. తాపత్రయాది సర్వత్రికములను అధిగమించిన ఋషి అత్రి

మహర్షి అనసూయా అత్రి దంపతుల తపఃఫలము దత్తాత్రేయ అవతారము. త్రిమూర్త్యాత్మకమైన పరబ్రహ్మము ఈ దంపతులకు తన్నుగా తాను దత్తమయ్యెను.

అనసూయాత్రి సంభూతోదత్తాత్రేయోమహామునిః
స్మర్తృగామీ స్వభక్తానాముద్ధర్తాభవబంధనాత్"

శ్రీ దత్తమూర్తిని గూర్చి స్కాంద, మార్కండేయ, భాగవత, దేవీభాగవత, హరివంశ పురాణములందును, కాశీఖండమందును, శతశ్లోకియందును, ఉపనిషత్తులందును చెప్పబడినది. శ్రీ దత్తాత్రేయ ఉపనిషత్తుకలదు. తంత్రగ్రంథములలో దత్తాత్రేయ ప్రశంసకలదు. మన ఆంధ్రదేశములో దత్తాత్రేయ పూజ, ఉపాసన, చరిత్ర పారాయణాదులు గూర్చి తెలిసినవారు తక్కువ. మహారాష్ట్ర, కన్నడ దేశములలో దత్తమూర్తిని తెలియనివారుండరు. అచ్చట ప్రజలు భక్తిశ్రద్ధలతో దత్తమూర్తిని పూజింతురు. గురుచరిత్ర పారాయణము చేయుదురు. భజనలలో పాల్గొందురు.

ఈనాడు జాతి, కుల, మత, కక్షలతో భయంకర మారణకృత్యములకు తలపడుచున్న ప్రజలకు శ్రీ గురుదత్తాత్రేయ స్మరణము చాల అవసరము. శ్రీ దత్తదేవుని పూజించుటకు అన్నిమతములవారు, అన్ని జాతులవారు అన్ని కులములవారు అర్హులే.

శ్రీ దత్తమూర్తి స్మరణమాత్ర సంతుష్టుడు. స్మరణమాత్ర సన్నిహితుడు. భక్తుడయినా కాకపోయినా ఆస్తికుడైనా నాస్తికుడైనా దత్తమూర్తికి అందరూ సమానులే. 'దత్తా' అని స్మరించిన తక్షణమే అదృశ్యరూపమున దగ్గరకు వచ్చి దత్తదేవుడు కోరికలు తీర్చునని శ్రుతి తెలుపుచున్నది. శాంతి సుఖములను కోరువారు శ్రీ దత్తగురుమూర్తిని భక్తిశ్రద్ధలతో ఉపాసించవలెను.

శ్రీ దత్తమూర్తి జ్ఞానయోగనిధి, విశ్వగురువు, యోగిజనప్రియుడు, భక్తవత్సలుడు, సర్వసాక్షి, సిద్ధసేవితుడు. ఈ మూర్తి బ్రహ్మాండముల స్థితికి, శాంతినెలకొల్పుటకు సహకరించును.

"ఎప్పుడెప్పుడు ధర్మమునకు గ్లాని సంభవించుచున్నదో అప్పుడప్పుడు దుష్టశిక్షణము సాధురక్షణము చేయుటకొరకు నేను ప్రతియుగమునందును ఉద్భవించుచున్నాను" అని భగవదుక్తి. ఆయా అవతారములు ఆయా ప్రయోజనములు సాధించిన తర్వాత తమ ఉపాధులను త్యజించవలసినదే. రామకృష్ణాద్యవతారములు ఒక నిర్దిష్ట కార్యమునకుగాను వచ్చినవను విషయము ఎల్లరకు తెలిసినదే.

సర్వజీవులకు జ్ఞానబోధ గావించుట తనను స్మరించినంతనే దగ్గరకు వచ్చి కోరికలు తీర్చుట, తరింపచేయుట దత్తమూర్తి చేయుపని. ఈ మూర్తి శాశ్వతము, జ్ఞానమయము, ప్రేమమయము, సత్యానందమయము, ధర్మమయము.



మరోసారి

# సాయికథలు

- అక్కిరాజు
రమాపతిరావు

## ఇందుగలడందులేడని సందేహమువలదు

చావు పుట్టుకలు నిర్ణయం చేసేవాడు సద్గురువు. ఈ సుఖం సుఖంకాదనీ ఈ దుఃఖం దుఃఖం కాదనీ నేర్పుతాడు సద్గురువు. అది తెలియడమే మోక్షం. అప్పుడు ఏ చీకూచింతా ఉండదు.

సాయిబాబా సద్గురువు. ఆయన ఎన్నోమాట్లు ఇట్లా అన్నారు.

"నామనుష్యుడు ఎంతదూరాన ఉన్నప్పటికీ అథవా వెయ్యికోసుల దూరాన ఆవల ఉన్నప్పటికీ పిచ్చుక కాలికి దారం కట్టిలాగినట్లు నేను అతణ్ణి షిరిడీకి లాక్కుంటాను. ఇటువంటి పిచ్చుకలెన్నో ద్వారకామాయి మందిరంలో నిర్భయంగా ఉల్లాసంగా వాలి అక్కడి అనుభూతులనే ధాన్యాన్ని ముక్కున పొడుచుకొని తిని ఆనందించాయి. అది వారి వారి పూర్వజన్మ పుణ్యమేమో! లేదా ఏ జన్మలోనో బాబాతో సమకూడిన అనుబంధమేమో!

లాలా లక్ష్మీచంద్ అటువంటి అందమైన పిచ్చుక

మొదట్లో రైల్వే డిపార్ట్‌మెంటులో పనిచేసేవాడీయన. ఆ తర్వాత బొంబాయిలో శ్రీ వెంకటేశ్వర ముద్రణాలయంలో పనిచేశాడు. అటుతర్వాత ర్యాలీ కంపెనీలో గుమాస్తాగా పనిచేశాడు. బాబా తన లీలావతరాన్ని చాలించటానికి ఎనిమిదేళ్ళ పూర్వం లాలా లక్ష్మీచంద్ కాలికి ఆయన బలమైన దారం కట్టాడు. అప్పట్లో లక్ష్మీచంద్ శాంతాక్రుజ్‌లో ఉండేవాడు. క్రిస్మస్ పండగ ఇంకా రెండు నెలలకు వస్తుంది. ఒకరోజు లాలా లక్ష్మీచంద్‌కు కలవచ్చింది. ఆ కలలో చుట్టూ భక్తులెందరో గుమిగూడి ఉన్న ఒక దివ్యపురుషుణ్ణి, వయసుమళ్ళినట్లు కన్పించేవ్యక్తిని ఆయన కలలో దర్శించాడు. ఆ తర్వాత ఒకరోజు లక్ష్మీచంద్ దత్తాత్రేయ మంజునాథ్ బిజూర్ ఇంటికి వెళ్ళాడు. లక్ష్మీచంద్‌కు నచ్చిన స్నేహితుడు బిజూర్. ఆ రోజున దత్తాత్రేయ మంజునాథ్ గారింట్లో దాసగణు మహారాజు సంకీర్తనం చేస్తున్నాడు. దాసగణు మహారాజ్ సంకీర్తన చేసేచోట సాయినాథ మహారాజ్ చిత్రపటం తప్పక

ఉండితీరుతుంది. తన కలలో దర్శనమిచ్చిన మహాత్ముడి ముఖకవళికలున్న ఈ చిత్రపటంలో కన్పించి ఆశ్చర్యపడ్డాడు లక్ష్మీచంద్. కాబట్టి సాయిబాబా తనను స్వప్నంలో అనుగ్రహించినట్లు నిశ్చయించుకున్నాడాయన.

ఆరోజున తుకారాం జీవితం హరికథ చెప్పాడు దాసగణ మహారాజ్. ఆ కథ మహా ఇంపుగా అందరినీ ఆకర్షించింది. ఆ సన్నివేశం లక్ష్మీచంద్‌ను ఎంతో ఉత్తేజితుణ్ణీ, ఉద్విగ్నుణ్ణీ చేసింది. ఎప్పుడెప్పుడు షిరిడీ వెళదామా అని ఉవ్విళ్ళూరాడు లక్ష్మీచంద్.

ఆధ్యాత్మిక తపన కల భక్తుడు ఒకడుగు ముందుకువేస్తే అతణ్ణే వెదుక్కుంటూ సద్గురువు మూడడుగులు ముందుకు ఎదురువస్తాడని పెద్దలంటారు. లక్ష్మీచంద్ విషయంలో నిక్కచ్చిగా అదే జరిగింది. భజన సమావేశం ముగిసి ఇట్లా లక్ష్మీచంద్ ఇంటికి వచ్చాడోలేదో ఆయన స్నేహితుడు శంకరరావు వచ్చి తలుపుతట్టి షిరిడీ వెళుతున్నాను వస్తావా అని అడిగాడు. లక్ష్మీచంద్ ఆనందానికి అవధులు లేకపోయాయి. తన పినతండ్రి కొడుకును 15 రూపాయలు అప్పు అడిగితే అతడు వెంటనే ఇచ్చాడు షిరిడీ ప్రయాణపు ఏర్పాట్లన్నీ చకచకా పూర్తిచేసుకున్నాడు లక్ష్మీచంద్.

రైలు ప్రయాణంలో లక్ష్మీచందూ ఆయన స్నేహితుడు శంకరరావు సాయిబాబా స్తవనమంజరి పాటలు పాడుతూ భజన చేశారు. తోటి ప్రయాణీకుల షిరిడీ అనుభవాల గూర్చిన్నీ వాకబుచేశారు. ఎన్నో సంవత్సరాలనుంచీ మహిమోపేతుడుగా బాబా విలసిల్లుతున్నాడని వాళ్ళు చెప్పారు. కోపర్‌గాం స్టేషనులో దిగి బాబా కోసం మంచి జామపండ్లు కొనాలని లక్ష్మీచంద్ తలపోశాడు. కాని ఏదో పారవశ్యం అతణ్ణి చుట్టుముట్టింది. దివ్యావేశంలోగొనన్ది జామపండ్ల సంగతి మరచేపోయాడతడు. షిరిడీ సమీపిస్తుండగా ఆ విషయం అతడికి చటుక్కున జ్ఞాపకం వచ్చింది. వాళ్ళు గుర్రపుబండిలో షిరిడీ సమీపిస్తున్నారు. ఇంతలో ఒక ముసలమ్మ గుర్రపుబండి వెనకే పరిగెత్తుతూ రావడం వాళ్ళు చూశారు. ఆమె తలపైన జామపండ్ల గంప వుంది. ఆ పండ్లు ఎంతో బావున్నాయి. బండినాపి కొన్ని పండ్లు ఏరి వాళ్ళిద్దరూ తీసుకున్నారు. విచిత్రంగా ఆ ముసలమ్మ తక్కిన పండ్లను కూడా ఊరికే తీసుకుని తన పక్షాన బాబాకు సమర్పించమనికోరింది. దాంతో లక్ష్మీచంద్ భావావేశంతో ఉబ్బితబ్బిబ్బైనాడు. తాను జామపండ్లు కొని బాబాకు నైవేద్యంగా ఇవ్వాలనుకోవడం, ఆ విషయమే మరచిపోవడం, ఆశ్చర్యకరంగా ముసలమ్మ బండి వెనకే పరిగెత్తిరావడం,

జామపండ్లన్నీ ఇవ్వడం ఇదంతా ఏమిటి? బాబా లీలగాక! అనిపించిందతడికి. బాబానే ఆ ముసలమ్మని పంపించి ఉంటారనీ తోచిందతడికి.

మసీదుపై జెండాలు కలకలలాడుతూ రెపరెపలాడుతూ రంగులరంగులతో మెరిసిపోతూ వాళ్ళకు స్వాగతం చెప్పాయి. వాళ్ళు సంతోషంతో దూరంనుంచే మసీదుకు నమస్కరించారు. పూజా సామగ్రి సమకూర్చుకొని వెళ్ళి బాబాను దర్శించి నిండు మనస్సుతో అర్పించాడు లక్ష్మీచంద్ సంతోషంతో ఉప్పొంగిపోయినాడు. సువాసన గల గులాబీ పుష్పం కంటపడితే మధుపం ఎంత ఉబలాటం చెందుతుందో బాబా పాదాలు చూసి అంతగా విహ్వలుడైనాడు లక్ష్మీచంద్.

అప్పుడు బాబా ఇట్లా అన్నాడు. ఒక్కరివాడు, దారిలో భజనచేశాడు. వాళ్ళనూ వీళ్ళనూ బాబాను గూర్చి వాకబు చేశాడు. వాళ్ళనీ వీళ్ళనీ అడగటం ఎందుకు? మనకండ్లతోనే మనం సమస్తమూ చూడాలి. పరీక్షించుకోవాలి. ఇప్పుడు చెప్పు నీకల నిజమా? అబద్ధమా!! మార్వాడీ దగ్గర 15 రూపాయలు అప్పు చేయాల్సిన అవసరం ఏమొచ్చింది? మనస్సులో కోరిక ఉంటే దర్శనం కాదా?'

ఈ పలుకులు విని పరవశించిపోయాడు లక్ష్మీచంద్. బాబా సర్వజ్ఞత్వానికి ఎంతగానో ఆశ్చర్యపోయినాడు. తర్వాత కాలంలో అతడు గ్రహించిందేమంటే అప్పుచేయడమనేది బాబాకు ఇష్టంలేదని. తన దర్శనంకోసమైనా అప్పుచేసి రావడం ఆయన ఇష్టపడరని అంతేకాదు విందులు, వినోదాలు, పండగరోజు ఉల్లాసాలకోసం అప్పుచేయడం ఆయనకేమాత్రమూ ఇష్టం ఉండదని.

మధ్యాహ్న ప్రసాద వినియోగంలో ఒక భక్తుడు లక్ష్మీచంద్‌కు సాంజాను ఇచ్చాడు. అది తిని ఎంతగానో సంతోషించాడు లక్ష్మీచంద్. ఆ మర్రోజు కూడా ఎవరైనా తనకు సాంజా ఇస్తే బాగుండునని అతడి గుండె కొట్టుకలాడింది. కాని ఆ రోజు బాబాకు అర్పించటానికి ఎవరూ సాంజా తేలేదు. లక్ష్మీచంద్ జిహ్వ సాంజాకోసం ఊరిపోతున్నది. మూడోరోజు హారతి సమయంలో బాబా ఆంతరంగిక భక్తుడైన బాపూసాహెబ్ జోగ్‌బాబాను ఇవాళ ఏ ప్రసాదం తీసుకొని రమ్మంటారు నైవేద్యానికి? అని విచిత్రంగా అడగటం సంభవించింది. సాంజా తీసుకొని రమ్మని బాబా అనటమూ కూడా వెనువెంటనే జరిగింది. ఇకనేం! భక్తులు రెండుకుండల నిండా సాంజా తెచ్చి బాబా ముందు నైవేద్యంగా సమర్పించారు. లక్ష్మీచంద్‌కు అవాళ

ఆకలి కూడా దహిస్తున్నది. వీపు నొప్పికూడా బాధపెడుతున్నది బాబా కరుణార్ద్ర దృష్టితో 'నీవు ఆవురావురుమని ఆకలితో ఉండటం ఎంతో మేలైంది. కడుపు నిండా సాంజా తిను. వీపు నొప్పిగూర్చి బాధపడవద్దు. ఏదైనా ఔషధం తీసుకుంటే ఆ నొప్పి మాయమైపోతుంది' అని లక్ష్మీచంద్‌తో బుజ్జగింపుగా పలికారు.

లక్ష్మీచంద్‌కు ఎంతో ఆశ్చర్యమైంది. బాబా తన మనస్సుని తనకంటే బాగా తెలియడమే ఆ ఆశ్చర్యం ఆరోజే చావడి ఉత్సవం చూసే అదృష్టం కూడా కలిగింది లక్ష్మీచంద్‌కు. అతడెంతో సంతోషం అనుభవించాడు. అయితే బాబా ఎందుకో ఆరోజు నలతగా ఉన్నట్లు కన్పించింది అతడికి. మనసులో అమాయకంగా ప్రేమగా బాబాకెవరిదో దిష్టి తగిలింది అనుకున్నాడతడు.

ఆ మర్రోజు ఉదయమే లక్ష్మీచంద్ మసీదుకు వెళ్ళాడు. సరిగా తాను వెళ్ళే సమయానికే బాబా శ్యామాతో ఇట్లా అంటున్నారు 'శ్యామా ఎవరిదో దోషదృష్టి తగిలిందినాకు. అందుకే నలిగిపోయినట్లు కనపడుతున్నాను.'

లక్ష్మీచంద్ ఆశ్చర్యానికి అంతులేదు. తన మనస్సులో ఏది అనుకుంటే అది బాబా పైకి చదివేస్తున్నారు. అక్కడ ఉన్నన్ని రోజుల్లో బాబా సర్వాంతర్యామిత్వానికి, సర్వభూతహితానికి, కారుణ్యానికి ఎన్నో నిదర్శనాలు చూశాడు లక్ష్మీచంద్. బాబా దగ్గర శెలవు తీసుకుంటున్నప్పుడు ఆయన కాళ్ళమీద పడి 'నీ దయాదాక్షిణ్యాలు వినా నాకీ ప్రపంచంలో ఏమీలేవు. ఏవీవద్దు. నా మనస్సు ఎప్పుడూ మీ పాదాలపైనే లగ్నమయి ఉండేటట్లు అనుగ్రహించండి. మీ కటాక్షమే నన్నీ ప్రపంచభారంనుంచి రక్షించాలి మీ కీర్తనపట్ల నా మనస్సు ఎప్పుడూ ప్రతివహించాలి మీ నామాన్నే నేనెప్పుడూ జపించే మనస్థిమితం నాకు మీరే ప్రసాదించాలి' అని వేడుకున్నాడు.

బాబా ఆశీర్వాదం, ఊదీ ప్రసాదం అందుకుని అతడు షిరిడీ విడిచిపెట్టాడు. అయితే అతడు షిరిడీనే సదా తన మనసులో పదిలపరచుకొన్నాడు ఎవరైనా షిరిడీ వెళుతున్నారని తెలిస్తే చాలు పూలమాలలు, కర్పూరం, నైవేద్యం, దక్షిణ పంపుతూవచ్చాడు.

సాయిబాబాను ఎవరైనా ఎక్కడైనా వెదకి చూడాల్సిన పనిలేదు

హృదికి ఆయన ఎప్పుడూ సన్నిహితంగానే ఉంటాడు తలచుకోవాలనేగాని.

# కాళిదాస సందేశము

(గతసంచిక తరువాయి) - *కీ॥ శే॥ శ్రీ అక్కిరాజు నిత్యానందశాస్త్రి*

అను విషయమును గవి వారి ప్రాభవ సంపదలున్నది. వారి వస్తు వాహనములు గలవు. వారి సౌఖ్య సమృద్ధియు జగద్వితము. వారు రూపమును సర్వభావములతో నారాధింపగల కాముకులగుట గణనీయము. కాని వారి బార్వతి, నిరసించెడి. తన వరునకు రూపవిత్తాదికమగు వస్తుజాతము లేదనెడిశంక యామెకావిర్భవింపను. ధర్మ స్వరూపపు టాకర్షణమందే, సాధ్వికి సౌఖ్యసంచయు సకలము సాక్షాత్కరించెను. ధర్మావలంబమందే రూపమనోహరత్వము, దీపించెను. అందే యద్వితీయమగు శృంగార మాస్వాదితమయ్యెను. మోహ పరవశత్వముదయించెను. కవి వర్ణించిన విరహిణ్యవస్థలు, జగద్గురు సహధర్మిణీత్వమున బార్వతికిగల యనురాగ సాంద్రత్వమును విశదీకరించెడిని. ఇయ్యది, యింద్రియలోలత్వమును జనింపజేయు పశుత్వమునకు సంబంధించినవి కావు. విషయలోలత్వాభావమును కవి విస్పష్టముగ వివరించెడిని.

శ్లో॥ అసహ్యా హుంకార నివర్తితః పురా
పురారి మప్రాప్త ముఖః శిలీ ముఖః
ఇమాం హృది వ్యాయతపాత మక్షిణో
ద్విశీర్ణమూర్తే రపి పుష్పధన్వనః॥ 5-54

(వ॥ పూర్వ మసహ్యా హుంకార నివర్తితమై, యీశ్వరుని బ్రాపింపని ముఖముగల పుష్పధ్వనిబాణము, నష్టదేహుని శిలీముఖమయ్యు హృదయమందు చిరకాల స్థాయిగల పాతమేర్పడునట్లీమెను బాధించెను)

అని, పుష్పధన్వి దగ్ధుడై పోయిన సంగతిని జ్ఞప్తికి దెచ్చెడిని. ఇంద్రియ విలోలత్వము, వినాశము నొందియున్న, విషయమును వివరించుచు, పశుచర్య పరమప్రయోజనము కాజాలని వరవిషయికమగు పవిత్రవాంఛ పార్వతీ హృదయమున నుత్పన్న మయ్యెనని కవివర్యు ప్రకటించును. సమాగమ మంగీకృత ప్రాయమైన సమయమున మహేశ్వర సహధర్మిణీత్వమును బ్రాపింపజేసెడి ధర్మమూలమగు నభిలాష పార్వతీ హృదయమున బ్రతిష్ఠితమైనదని ప్రవచించును మనస్సు నావేశించియున్న యీ భావ వ్యగ్రతనే కరుణాజనకము నాయికాసంతాప ప్రదర్శనముతో కవిశేఖరుడు తెలియజేసెడిని. మఱియు బ్రేమనిర్ణయమున నింద్రియాభ్యర్థితములగు, రూపవిత్తములు, వనోవిషయములు కావని స్పష్టముగనే, సచ్చరితుడు చాటితెల్పెడిని. దీనికి సంబంధించిన కవి శ్లోకములను బొందుపఱతును.

శ్లో॥ త్వమేవ తావత్పరి చిన్తయ స్వయం
కదాచిదేతే యది యోగ మరతః

వధూ దుకూలం కలహంసలక్షణం
గజాజినం శోణితబిన్దువర్షిచ॥ 5-67

(వ॥ వధువుయొక్క కలహంస చిహ్నితమగు దుకూలము రక్త బిందువులను వర్షించుచుండెడి గజాజినము, ఈ రెండును ఎప్పుడైనను సంయోగమునకు తగినవేమో నీవే తగినంతవఱకు పర్యాలోచించుకొనుము.)

శ్లో॥ అవస్తు నిర్బన్ధ పరేకథం నుతే
కరోఽయ మాముక్త వివాహకౌతుకః
కరేణ శమ్భో ర్వలయీకృతాహినా
సహిష్యతే తత్ప్రథ మావలమ్బనమ్॥ 5-66

(వ॥ తుచ్ఛ వస్తువునం దభినివేశ ప్రధానముగాగల ఓ పార్వతీ! పెండ్లి కంకణమును ధరించిన ఈ నీచేయి భూషణీకృత సర్పమగు శమ్భునిచేతి యపరిచితావలంబనము నెట్లు సహింపగలదు)

శ్లో॥ ఇయఞ్చ తే ఽ న్యా పురతో విడమ్బనా
యదూఢయా వారణరాజ హార్యయా
విలోక్య వృద్ధోక్ష మధిష్ఠితం త్వయా
మహాజనః స్మేరముఖో భవిష్యతి॥ 5-70

(వ॥ నీకు మొదటనే మఱియొక పరిహాసముగూడ గలదు. పరిణీతవై యిభరాజ వాహ్యవగు నీ వధిష్ఠించియున్న ముసలియెద్దును జూచి సాధుజనము నవ్వుముఖము కలదగును.)

శ్లో॥ వపు ర్విరూపాక్ష మలక్ష్య జన్మతా
దిగమ్బరత్వేన నివేదితం వసు,
వరేషు యద్బాల మృగాక్షి మృగ్యతే
తదస్తికిం వ్యస్తమపి త్రిలోచనే॥ 5-72

(వ॥ శరీరము వికారమగు కన్నులుగలది. జన్మయజ్ఞాతము విత్తమును దిగంబరత్వము నివేదించెడిని. ఓ బాల మృగాక్షీ! వరులయందన్వేష్టమగు దానియం దొక్కటి యైనను త్రిలోచనుని యందున్నదా?)

ఈ పంక్తులలో గవి పార్వతీ ప్రేమ సమర్పణమందు వ్యావహారిక కామచోదన మణుమాత్రమైనను లేదని తెలుపుచున్నవాడు. రూపవిత్తముల యొక్కయు, వస్త్ర వాహనముల యొక్కయు నీరసత్వము ప్రకటితము. ఐశ్వర్యముయొక్కయు, నైహికభోగముల యొక్కయు, క్షుద్రత విశదీకృతము ఈశ్వరుడు మణిమయ

భూషణాలంకృతుడు గాడు. రక్తబిందువులను వర్షించెడి కర్కశ గజాజినమును ధరించినవాడు. భద్రేభవాహనుడు గాడు. వృద్ధోక్షము నధిష్ఠించినవాడు. మనోహరాకారుడుగాడు. నిటలాక్ష వైరూప్య విశిష్టుడు. వైభవ సంపన్నుడుగాడు. దిగంబరుడు. కాని పార్వతీ ప్రేమ సమర్పణమున కర్థకామములు కారణములుగావు. అర్థ కామముల సామాన్య వ్యామోహము, ధర్మ భావనమందే యామెకు సమగ్రమున గోచరించెను. కామమును, ధర్మారాధన సాధనముగ నొనర్చుకొనుటయందే సాధ్వికి సర్వసమ్మోహనత్వము గనుపించెను. ఈశ్వర లబ్ధికే దుశ్చరమగు తపస్సునందామె ప్రవేశించెను. ఇక బార్వతి పరమేశ్వర నిందనెట్లు సహింపగలదు. సాధారణదృష్టితో శంకరునియందు దోషారోపణ మొనర్చుట యామెకెట్లు రుచింపగలదు. హృదయారాధనను చూఱగొనిన లోకేశ్వరుని విషయమున లోకసామాన్యుల యభిప్రాయములనామె యెట్లాదరింపగలదు. అట్లగుటంజేసియే .

శ్లో॥ అలం వివాదేన యథాశ్రుతస్త్వయా
తథావిధ స్తావ దశేష మస్తు సః
మమాత్ర భావైకరసం మనఃస్థితం
నకామవృత్తి ర్వచనీయ మీక్షతే॥ 5-82

(వివాదము చాలును, ఆయన యశేషముగ నీవు వినిన విధము గలవాడే కావచ్చును. నామనస్సామహాత్ముని యందు భావైక రసమైయున్నది. కామవృత్తికి నిందావిచారములేదు)

అని పార్వతి బ్రహ్మచారికి బ్రతివచన మొసగును. ఈతీరున, నర్థకామములు, పార్వతీప్రేమనిర్ణయమునకు విషయములు కావని, కవి తెలుపుటయేకాక, తపశ్చరణము మూలమున, సర్వసౌఖ్యములను పరిత్యజించుటకు సంసిద్ధపడగల ధర్మాభినివేశమును, కవి గౌరియందు గోచరింపజేసెడిని. అభీష్ట సిద్ధి కొఱకామె పితృగ్రహమందున్న దివ్యోపభోగములను దృణీకరించి, సంతోషముతో ద్యజించెను. వివిక్త ప్రదేశమే, మానినికి మణిమయ సౌధరాజమయ్యెను. శిలాతలమే శైలాత్మజకు పుష్పశయ్యగ బరిణమించెను. ఘోరారణ్యామే, సుదతికి సుందరోద్యాన సౌందర్యమును జూపగలిగెను. వల్కలమే, చీనాంశుకముగ చెలువొందెను. ముఞ్జీమయమగు మేఖల జడలుగట్టిన శిరోరుహములు రత్నఖచితాభరణములై రాజిల్లెను. మహాత్ముని సాహచర్యమే మనస్సునాకర్షించెను. భోగవిలాసముల చింతనమపాస్త మయ్యెను. ఈశ్వరుడు ధర్మకారణమగు మహాత్ముడగుటవలననే యారాధనను పొందగలిగెనను విషయమును పార్వతీ వాగ్రూపమున నూడకని ప్రకటించును.

శ్లో॥ అలోకసామాన్య మచిన్త్యహేతుకం
ద్విషన్తి మన్దాశ్చరితం మహాత్మనా॥ 5-75

(అచింత్య హేతుకమై, యలోకసామాన్యమగు, మహాత్ముల చరిత్రను, మూఢులు ద్వేషించుచుందురు)

శ్లో॥ నకేవలం యో మహతోపభాషతే
శృణోతి తస్మాదపి యస్సపాపభాక్॥ 5-83

(మహాత్ములను నిందించువాడేకాక. వానివలన నిందావచనమును వినువాడుగూడ పాపమును పొందిన వాతగును.)

ఈతీరున పార్వతీ ప్రేమతత్త్వమును బ్రదర్శించి యంతటం దనియక కవి ముక్త కంఠముగ గూడ విషయమునిట్లు వివరించును.

శ్లో॥ అనేన ధర్మస్సవిశేషమద్యమే
త్రివర్గసారః ప్రతిభాతి భావిని,
త్వయా మనోనిర్విషయార్థకామయా
యదేక ఏవ ప్రతిగృహ్యసేవ్యతే॥ 5-38

(భావినీ! అర్థకామములను దలపెట్టని నీచేత ధర్మమొక్కటియే, స్వీకృతమై సేవింపబడుటంజేసి, నాకిప్పుడు ధర్మము సాతిశయముగ ద్రివర్గముల సారమై తోచెడిని)

అని కవి విశదీకరించుచు, ప్రేమనిర్ణయమున పార్వతి, ధర్మమును, అనగా ధర్మవిశిష్టకామము నవలంబించిన విషయమును విస్పష్టపరచెడని. కాళిదాస సర్గముందిట్లు ధర్మవిశిష్టకామము చోదకముగ దృష్టమయ్యెడిని.

"దాంపత్యసంఘటనము"

కవి పార్వతీ ప్రేమతత్త్వమును బ్రకటించి, వెంటనే నివాహౌత్సుకము నీశ్వరుని యందు బ్రవేశపెట్టును. ధర్మవిశిష్టమగు కామము, నిర్ణయించిన ప్రేమచే బోదితమగు దాంపత్యమును బ్రతిపాదించుటయందు, తనకుగల యభిమానమును, కవి విశదమొనర్చెడిని. ఇట్టి దాంపత్య మహిమను గూడ కవి వెల్లడించును ధర్మనిర్ణీతమగు ప్రేమతో ననువిద్ధమగు దాంపత్యమే, ఉత్తమోత్తమమగు దాంపత్యమని ప్రకటించును. పార్వతీ తపశ్చరణోద్యమ సందర్భమున నీ యుద్దేశమును ముందే కవి ప్రకటించెడిని.

శ్లో॥ ఇయేష సాకర్తు మవన్ధ్య రూపతాం
సమాధి మాస్థాయ తపోభిరాత్మనః
అవాప్యతేవా కథ మన్యథాద్వయం
తథావిధంప్రేమ పతిశ్చ తాదృశః॥ 5-2

(ఏకాగ్రతను పొంది, తపస్సులతోనామె, తన కవంధ్యరూపమును

సాధించుకొనగోరెను. అంతకన్న మరియొక విధమున నట్టిపతియు, నా విధమగు (ప్రేమయు రెండునునెట్లు లభింపగలవు.)

పితృగృహమునంగల సర్వసౌఖ్యములను బరిత్యజించి దుస్సహమగు తపః క్లేశమును భరింపగల ధర్మాభినివేశము పార్వతికి లేనిచో, మృత్యుంజయునివంటి పతియు, నర్ధశరీరమును సమర్పించెడి ప్రేమయు, నెట్లు లభించునని కవి ప్రవచించును. మహితగుణారాధనమందు మనస్సు స్థిరత్వమును పొందినపుడే, అర్థకామములు ధర్మమందు లీనమైనపుడే నట్టి మహత్వము సిద్ధించునని విదితమయ్యెడిని. కాదేని కామనిష్ట ఫలప్రదమగుట నిశ్చయము. రూపమునాశ్రయించిన కాదు మస్థిరమైనది. అది చాంచల్య దోషసంయుతము. మఱియు, విత్తసౌఖ్యముల నాశ్రయించిన కామము, తదభావమున నశింపగలదు. కాని ధర్మవిశిష్టమగు ప్రేమకాత్మసమర్పణమే కర్తవ్యము. ఆపదలయందును, సంపదలయందును, మణిమయ సౌధములయందైనను, మహారణ్యముల యందైనను సేవా తత్పరత్వమే హృదయప్రబోధనము. ధర్మపథవర్తనమే వ్రతము. ధర్మవిశిష్టమగు ప్రేమతో పార్వతి పత్నీభావమును బ్రకటించుట వలననే యీశ్వరునిపై గార్హస్థ్యము సంపూర్ణాధికారము వహించెనని కవి తెలుపుచున్నవాడు.

శ్లో॥ తద్దర్శనా దభూచ్ఛంభోః
భూయాన్ దారార్థ మాదరః
క్రియాణాం ఖలు ధర్మ్యాణాం
సత్పత్నో మూలకారణం॥ 6-13

(ఆమె సందర్శనమువలన నీశ్వరునకు దారార్థమగు నాదరమెక్కువ యయ్యెను. ధర్మ్యమైన క్రియలకు సత్పత్నులు మూలకారణముగదా!)

"ధర్మ్యము"

అరుంధతీ సందర్శనమువలన నీశ్వరునకు దారార్థమగు నాదరము బహుతరమయ్యెను. విశుద్ధమగు పార్వతీ ప్రేమ తత్వమును సందర్శించిన యీశ్వరునకు, లోకప్రవృత్తికి హేతుభూతమై, ధర్మ్యక్రియలకు మూలాధారమగు గార్హస్థ్యము, మనోహరరూపముతో గోచరించెను. ఇంక దాంపత్యము సంఘటితమయ్యెను. ఇది ధర్మవిశిష్ట కామముతో నిబద్ధమైన దాంపత్యము. ఆలోక సామాన్యము. శరీరములను నాత్మలును నేకమై పోయినవి.

శ్లో॥ అద్య ప్రభృత్యవనతాంగి తనాస్మిదాసః
క్రీతస్త్వి పోభిరితి వాదిని చన్ద్రమౌళౌ
అహ్నాయ సానియమజంక్లమ ముత్ససర్జ
క్లేశః ఫలేనహి పునర్నవతాం విధత్తే॥ 5-86

(సన్నతాంగీ! ఈ దినము మొదలుకొని, నీ తపస్సుతో గొనబడిన దాసుడ నగుచున్నవాడనని చంద్రశేఖరుడు పలుకగా, నామె వెంటనే తపోజన్యమగు క్లేశమును వదలిపెట్టెను. క్లేశము ఫలసిద్ధిచే వెనుకటివలె ప్రత్యగ్రత నాపాదించునుగదా!)

"ఓ పార్వతీ! పవిత్రప్రేమ తత్త్వమూలమగు తపస్సుతో నన్ను వశీకరించితివి. నేనిది మొదలు నీకు దాసుడనై వర్తింతును" అని యీశ్వరుడు వచించును. తన యర్ధ శరీరమును బార్వతికి సమర్పించును.

-శ్లో॥ తమర్థమివ భారత్యా సుతయా యోక్తుమర్హసి॥ 6-71

(వాక్కుతో నర్థమును గూర్చినట్లు, సుతతో నాయనను సంయుక్తునింజేయుటకు దగుదవు.)

అని యంగిరసుచేత బలికించిన సందర్భమందును

శ్లో॥ వాగర్థా వివసంపృక్తౌ
వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌవన్దే
పార్వతీ పరమేశ్వరౌ॥

(వాగర్థములవలె గలసి, జగత్పితలైన పార్వతీ పరమేశ్వరులకు, వాగర్థజ్ఞానము కొఱకు నమస్కరించుచున్నాను.)

అని కీర్తించిన కావ్యాంతర సందర్భములందును, వియోగ దృష్టికి దుర్నిరీక్షమగు జాయాపతుల సంయోగమే, కవికి గోచరించెడిని. ఈ విధమున గాళిదాసు, ధర్మవిశిష్టమగు ప్రేమతో నిబద్ధమైన దాంపత్యమహిమను విశదీకరించెడిని.

**"కామమున కనుజ్ఞ"**

మఱియొకమారు, ఇంద్రియలోలత్వ జనకమగు, కామవిషయమును గవి ప్రస్తావించును. ప్రేమను నిర్ణయించుట కీకామమున కర్హతలేదని కవి యిదివరకే తెలిపియున్నవాడు. ధర్మమున కధీనమైన యనంతరము, కామమున కర్హతలేదని కవి యిదివరకే తెలిపియున్నవాడు. ధర్మమున కధీనమైన యనంతరము, కామమున కనుజ్ఞ కవిదృష్టిలో నుచితమయ్యెడిని. దాంపత్యానుష్ఠానమువలన కామమున కుజీవనావకాశము లభించినదని కవి తెలియజేయుచున్నవాడు.

శ్లో॥ ధర్మేణాపి పదం శర్వేకారిచే పార్వతీంప్రతి
పూర్వాపరాధభీతస్య కామస్యో చ్ఛ్వసితం మనః॥ 6-14

(శివుడు ధర్మప్రేరితుడై పార్వతి నభిలషింపగా పూర్వాపరాధ భీతుడగు

కాముని మనస్సు బ్రత్యాస కలదయ్యెను. అనగా ఉజ్జీవించెడి యవకాశము లభించినదను ప్రత్యాశను మనస్సు పొందెను.)

గార్హస్థ్యము కొఱకీశ్వరుడు, పార్వతిని భార్యగా గ్రహింపగోరగా కాముని మనస్సుకు ప్రత్యాశ కలిగెను. "ఈ దశయందు గదా! మహాత్ములయందు నిలుచుటకు నాకు స్థానము లభింపగలదు" అని కామము గ్రహింపగలిగెను. గార్హస్థ్యము నాశ్రయింపనియెడల, నీ కామమునకు స్థానము శూన్యమని కవి యాశయము. ఇంద్రియములకు వశ్యులగుటవలన, సుందరీ సుఖానుభవమే జీవిత పరమార్థమగునని కవి యిదివరకే వ్యక్తపరచి యున్నవాడు. ఇంక యౌవన సంబంధాధికారమున్నను, ఇంద్రియ వ్యసన శృంఖలలతో నిబద్ధాత్ములై, మదనారాధనముతో జీవితమును గడుపు విధమును, కవి మరల నిషేధించును. ఆకాశవాణి, రతికి మారుని శాపావసానమును వెలిసి యూరడించిన సందర్భమున :

శ్లో॥ ఇతిచాహ సధర్మ యాచితః
స్మరశాపావధి దాంసరస్వతీమ్॥ 4-42

(ఆయన బ్రహ్మ ధర్మునిచే యాచితుడై, స్మరశాపావసానమును బ్రసాదించెడి వాక్కు నిట్లు పలికెను.)

సృష్టి ప్రసంగము నిలచిపోవునని ధర్ముడు బ్రహ్మను వేడుకొనగా, ధాత శాపావసానమును బ్రసాదించెను. లోక ప్రవృత్తి ప్రతిష్ఠకొఱకే కామునకు జీవనావకాశము గల్పితమయ్యెను. శాపము సంహృతము గావింపబడెను.

మఱియు నింద్రియ వ్యసనములను బ్రతిషేధించెడి కవియొక్క సందేశము, రఘువంశమందు గూడ గోచరించుచున్నది. సూర్యవంశపు రాజుల గుణగణములను సంకీర్తించిన సందర్భమందును, కుశుడయోధ్యా నగర్యధి దేవతతో సంభాషించిన సందర్భమందును, నీయంశ మావిష్కృతము.

శ్లో॥ త్యాగాయ సంభృతార్థానాం
సత్యాయ మిత భాషిణాం
యశసే విజిగీషూణాం
ప్రజాయై గృహమేధినాం॥

(త్యాగము కొఱకు సంభృతార్థులయినట్టియు, సత్యముకొఱకు మితభాషులైనట్టియు, యశస్సుకొఱకు విజయము నభిలషించినట్టియు, సంతతికొఱకు గార్హస్థ్యమును స్వీకరించినట్టియు, రఘువుల)

శ్లో॥ స్థిత్యై దండయతో దండ్యా
పరిణేతుః ప్రసూతయే

అప్యర్థకామౌ తస్యాస్తాం
ధర్మ ఏవ మనీషిణః॥

(లోక ప్రతిష్ఠకొఱకు, దండనార్హులను దండించినట్టియు, సంతతికొఱకు వివాహమాడినట్టియు నాబుధుని యర్థకామములు గూడ ధర్మమే అయినవి.)

శ్లో॥ కాత్యం శుభే కస్య పరిగ్రహోవా
కింవా మదభ్యాగమ కారణంతే
ఆచక్ష్య మత్వావశినాం రఘూణాం
మనః పరస్త్రీ విముఖ ప్రవృత్తి॥

(కళ్యాణీ! నీవెవరు? ఎవరిభార్యవు? నీవు నాసమీపమునకు రాగారణమేమి? నిర్జితేంద్రియులగు రఘువంశోద్భవుల మనస్సు పరస్త్రీ విముఖమగు ప్రవృత్తి గలదని తలచి భాషింపుము)

సూర్యవంశపు రాజులు సంతతికొఱకే వివాహము నాచరించిరని ప్రశంసాపూర్వముగ కవి తెలిపెడిని సంతానముకొఱకే వివాహమాడిన దిలీపుని కామముగూడ ధర్మమేయయ్యెనని వక్కాణించెడిని. ఆత్మీయ ప్రశంసయందు గుశుడు, రఘువంశోద్భవులమగు మేము విజిత విషయములమనియు, సూర్యవంశజుల సుగుణములన్నియు దనయందు, మూర్తీభవించి యున్నదనియు, ప్రకటించిన విధమును బ్రవచించెడిని. "ప్రజాయై గృహమేధినామ్" అను ధర్మాభిరతినే కుశుడు తనయందు వ్యక్త మొనర్చెడిని. ఈతీరున వ్యాససర్గమున గోచరించెడి గంధర్వ దంపతుల ప్రేమతత్వమునకు బ్రతిక్రియా రూపమగు, ప్రతిపాదనముగా నియ్యది భాసిల్లుచున్నది.

మఱియు నగ్నివర్ణుని ప్రస్తావనమందు, కవి భోగలంపటత్వము నిరసించి, విషయాపహృతమగు జీవితముయొక్క యనర్థములను బోధించెడిని. ఇందులకు కవి విరచిత శ్లోకముల నుదాహరింతును.

శ్లో॥ ఇంద్రియార్థ పరిశూన్యమక్షమః
సోఢుమేకమపి క్షణాంతరం
అంతరేవహరన్ దివానిశం
నవ్యపైక్షత సముత్సుకాః ప్రజాః॥

(శబ్దాది విషయసుఖ విరహితమగు, నొక్కక్షణాంతరమైనను, సహింపనొల్లక, రాత్రింబగళ్ళు లోపలనే విహరించుచు దర్శనా కాంక్షులగు ప్రజలను నపేక్షింపడయ్యెను.)

శ్లో॥ దృష్టదోషమపి తన్న సోత్యజత్
సంగవస్తు భిషజా మనాశ్రవః

స్వాదుభిస్తు విషయై ర్హృతస్తతో
దుఃఖమింద్రియ గణో నివార్యతే॥

(భిషగవిధేయుడై దృష్టదోషముగలదైనను, సంగవస్తువు నాయన వదలిపెట్టజాలకపోయెను. స్వాదువిషయములచే నింద్రియగణము హృతమయ్యేనేని కష్టముతో వానినుండి నివారితమయ్యెడిని.)

శ్లో॥ తంప్రమత్తమపి నప్రభావతః
శేకు రాక్రమితు మన్యపార్థివాః
ఆమయస్తు రతిరాగ సంభవో
ఆమయస్తు రతిరాగ సంభవో
దక్షశాప ఇవ చన్ద్ర మక్షిణోత్॥

(ప్రమత్తుడైనను ప్రభావమువలన నాయన నితరరాజులెదిరింప జాలకపోయిరి కాని రతిరాగమువలన నుత్పన్నమైన యామయము, చంద్రుని దక్షశాపమువలె గృశింపజేసెను.)

ఇంద్రియసుఖ విరహితముగ నగ్నివర్ణుడొక నిమిషమైనను గడపజాలక పోయెననియు, నహర్నిశ మంతఃపురమందేయుండి, దర్శనోత్సుకులై వచ్చిన ప్రజకు, గవాక్షములో నుండి, పాదమును మాత్రము జూపుచుండెననియు, నందువలన రాజయక్ష్మ పాలయ్యెననియు, విషయలోలత్వము యొక్క తుచ్ఛరూపమును గవి విదితమొనర్చును. ఈ ప్రేమ తత్త్వమునకు మదనారాధనమే సాధ్యపురుషార్థమనియు, నట్లగుటంజేసి యుత్తమ పురుషార్థములకు జీవితము దూరమగు ననియు, కవియొక్క ప్రధానమగు నాశయము. ఇంద్రియములకు స్వేచ్ఛావర్తనము నొసంగుట యాత్మవినాశము నొందుటయే యయ్యెడిని.

పవిత్రప్రేమభావము నాశ్రయింపజాలని పశుకామము, బహుళానర్థకారణమగుట, కవి ప్రకటితమైనది. బహువిధములనీ యంశము ప్రతిపాదితము. పవిత్ర కామప్రశంసా విధమునను, వ్యావహారిక కామప్రతిక్షేప వాక్యములవలనను, కవిపుంగవుడే తద్విషయ విశదీకరణమును గల్పించియున్నవాడు. రఘుకులుల సద్గుణ సంకీర్తనమీ విషయమును బ్రకటించును. మహేంద్ర సాన్నిధ్యమున మదనుడు వచించిన ప్రగల్భము లీతెఱగును దేటపఱచును. మఱియు నగ్నివర్ణుని యామయ వృత్తాంత మీ విషయమును విశదమొనర్చును. విషయకాంక్షగల గాంధర్వప్రేమ విధానము కవి సమ్మతము. హేయము. గాంధర్వకామము పశ్చాత్తాపాగ్నికుండమునంబడి పరితాపజ్వాలలయందు విశుద్ధినిబడయు వరకును వినిర్మల ప్రేమరూపమున విలసిల్లజాలదని కవి పుంగవుడు తెలిసియున్నవాడు. ఇయ్యది శకుంతలా దుష్యంతుల, దాంపత్య విఘటనమువలనను, స్పష్టపడినది. వ్యావహారిక కామమిట్లు కవిసర్గమున బరిత్యక్తమైనది. శశినా సహయాతి

కౌముదీ" అని రతిపల్కినట్లు కళానిధికి గౌముదికిని గల సంబంధమును దెలుపునట్టియు "వాగర్థావివ సంపృక్తౌ" అని కవి భాషించిన విధమున, వాక్కునకును నర్థమునకును గల సంయోగ ప్రభావమును జాట జాలినట్టియు, లోకోత్తర దాంపత్యమును బవిత్రత మెటియ బ్రతిష్ఠాపింపగల శక్తి "ధర్మవిశిష్ఠ కామమునకే కలద"ని కవి యాశయము. అట్టి దాంపత్యాశయమువలననే, కవివర్యుని రఘువంశ కావ్యమునకు" వాగర్థావివ సంపృక్తౌ" అనియెడి పార్వతీపరమేశ్వరుల సంస్తుతి ప్రార్థనా శ్లోకమైనది. కుమారసంభవ రచనానంతరమే "రఘువంశము" విరచితమగుట వేద్యాంశము. శివధనుర్భంగమొనర్చిన వీరునకు గన్యనొసంగుదుననెడి విదేహరాజ ప్రకటనము గల వాల్మీకి సర్గమున ధర్మము ప్రేమను నిర్ణయించును. తత్సర్గమున బిత్రునిర్ణయమే కన్యాప్రేమ సమర్పణ చోదన కారణముకాని కాళిదాస సర్గమున బ్రేమ సమర్పణమందు కన్యకు కాంక్షకలదు. కాని యది పవిత్ర గుణారాధనము. జనకుని కాంక్షకు విరుద్ధము. మఱియు తాద్రూప్య విశిష్టము. అట్లగుటంజేసి యిది వాల్మీకి ప్రేమ తత్వ సాక్షాత్కారము. మఱియు కామ విశిష్టమగుటచే తత్ప్రతిబింబమై మనోహర రూపమును ధరించిన "ధర్మవిశిష్టకామమై" తనరారెడిని. ఇట్టి మహోన్నత ప్రేమతత్వముగల "ధర్మవిశిష్ట కామము"నకు గవి దాంపత్యాధికారమును సమకూర్చి యొక పవిత్ర సందేశమును బ్రకటించెడిని.

ఇట్లు ధర్మ విశిష్ట కామస్వరూపము కుమార సంభవకావ్యమందు, ప్రస్ఫుట రూపముతో పరమాహ్లాద జనకముగ బ్రభవించినది. ప్రప్రథమమున గవి యింద్రియ ప్రేరణను గల్పించిన కామమును యావద్యత్న విశిష్టముగ వెలయించెడిని. చక్రీకృత చారుచాపముగల మదనుని రూపమీకామ సంరంభమును బ్రత్యక్షపఱచెను. అట్టి విషయ ప్రేరణగల కామ మనిష్ట మగుటంజేసి తృటిలో హరనేత్రాగ్నియందు దానిని గవి భస్మము గావించెను. అనంతరము ధర్మవిశిష్ట ప్రేమ తత్వమును వెలయించెను. రూపవిత్తాదులను లెక్కసేయని ధర్మవిశిష్టకామము రూపొందెను. దాంపత్యాధికారమును వహించెను. త్ర్యంబకుని గూడ నయ్యది దాసునిగ నొనర్చుకొనెను. పూర్వాపరాధ భీతుడగు కాముడప్పుడు నిట్టూర్పు విడిచెను. అనగా బవిత్ర దాంపత్య సంఘటనమందు దనకు సుత్కృష్టమగు ప్రవృత్తి కలదని యూరడిల్లెను. అట్లు సంఘటిల్లెడి దాంపత్యమున బరమర్షులు పరమేశ్వర హితముగ గన్యాదాన మర్థించిరి. సర్వసమ్మోదావహముగ శంకరుడు జాయను పరిగ్రహించెను. తద్విధ దాంపత్య ప్రభావము ప్రకటితమైనది. ధర్మవిశిష్ట కామస్వరూపముదాత్తముగ నుమాతమైనది. పవిత్రమగు కవిసందేశమీ విధమున బ్రకటితమైనది.

# శంకరవాఙ్మయము

-- హరి

స్మృతి పురాణానా మాలయం కరుణాలయమ్।
నమామి భగవత్పాద శఙ్కరం లోకశఙ్కరమ్॥

ఓమ్ నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యాసమ్ప్రదాయ
కర్తృభ్యో వంశ్యృషిభ్యో మహద్భ్యోనమో గురుభ్యః।

అద్వైతమతమునీ జగత్తున నలుదెసల వ్యాపింపజేసిన మహనీయులాదిశంకరులు. సాక్షాత్పరమేశ్వరావతారుడుగ కొలువబడుచున్నారు. శంకరభగవత్పాదులు ఉపదేశ ప్రకరణ గ్రంథములను 57, స్తోత్రగ్రంథములను 72, భాష్య గ్రంథములను 24 మొత్తము 153 గ్రంథములను రచించినట్లు పెద్దలు చెప్పుచున్నారు. కర్మ, భక్తి, జ్ఞానమార్గములను నిష్కామముగ ననుసరించువారికి బ్రహ్మజ్ఞానము లభించగలవనునది ప్రస్థానత్రయభాష్యములద్వారా జగద్వ్యాప్తము గావించినది పరమ పూజ్యులగు శంకరులే. అపారమగు వాఙ్మయము ద్వారా జ్ఞానోపదేశము గావించి, బహుశాస్త్ర పాండిత్యముతోను, వేదాంతశాస్త్ర ప్రావీణ్యముచేతను పండితుల ననేకుల నోడించి తన శిష్యులుగా జేసుకొనిరి.

శంకరవాఙ్మయమును పఠించి, వారి జ్ఞానోపదేశమును గ్రహింపనివారు దురదృష్టవంతులని జెప్పవచ్చును. సంస్కృతభాషా జ్ఞానముగలవారల కెల్లరకు అర్థమగునట్లు సరళమగు భాషలో యనేక గ్రంథములను రచించిరి. వేదాంగములగు ఉపనిషత్తులకు భాష్యమును, గీతాభాష్యమును, బ్రహ్మసూత్రభాష్యమును, విష్ణుసహస్రనామస్తోత్రమునకు భాష్యమును రచించి సకల వేదసారమును జగద్విదితముగా వించిరి.

శంకరుల యీ గ్రంథరాశినంతటిని ఏనిమిత్తము పఠింపవలయును, సారాంశమేమియను ప్రశ్నలు మనకు కలుగుట సహజము.

'బ్రహ్మసత్యం జగన్మిథ్యా, జీవోబ్రహ్మైవనాపరః'

అను నీ సత్యమును బోధించుటయే శంకరుల అద్వైత సారాంశము. ఇంతియేగాక యాగ, యజ్ఞ, జప, హోమాదుల నిర్వహణ, లోకోపకారములగు ఆరామతటాకాది నిర్వహణ, దానధర్మాదికముల నొనర్చుట, షోడశోపచారములచేతను స్తవములతోను, స్తోత్రములతోను భగవదారాధన జేయుట, ఇవియన్నియు చిత్తశుద్ధిని, చిత్తైకాగ్రతను గలిగించుచు, అద్వైత జ్ఞానమును కూడ కలిగించునని శంకరవాఙ్మయపఠనమువలన తెలియుచున్నది, కర్తవ్యాకర్తవ్య బోధకమగుచు సుఖమయ జీవనాధారముగూడ

నగుచున్నది. ప్రస్తుతము సందేహముల ననేకముల దొలగించి వివేకమును గూర్చు శంకరుల 'ప్రశ్నోత్తర రత్నమాలికా, ప్రశ్నోత్తరమణిరత్నమాలా'యను రచనలను అందలి కొన్ని శ్లోకములను జూతము.

కః పథ్యతరో ధర్మః కఃశుచిరిహ యస్యమానసంశుద్ధమ్।
కః పండితోవివేకీ విషమవధీరణా గురుషు॥

లోకములో మిక్కిలి హితకరమగునది ధర్మము. పరిశుద్ధమగు చిత్తము గలవాడె పవిత్రుడు. ఆత్మానాత్మ వివేకజ్ఞుడు పండితుడు, గురువును తిరస్కరించుట విషము.

కస్యవశేప్రాణిగణః సత్యప్రియభాషిణో వినీతస్య।
క్వస్థాతవ్యం న్యాయ్యేపథి దృష్టార్థలాభాయ॥

క్వోన్ధోయోఽకార్యరతః కోబధిరో యోహితానిన శృణోతి।
కోమూకోయః కాలే ప్రియాణి వక్తుంన జానాతి॥

కిందాన మనాకాంక్షం కింమిత్రం యోనివారయతి పాపాత్।
క్వోల ఙ్కారః శీలం కిం వాచాం మండనం సత్యం॥

సత్యమును, ప్రియమును బల్కుచు వినయము నగపరచువానికి జనులు వశులగుదురు. దృష్టార్థమగు లాభమును బొందగోరువాడు న్యాయమార్గము నవలంబింపవలయును.

అసత్కార్యరతుడంధుడు. హితోక్తుల విననివాడు బధిరుడు. సకాలమున ప్రియవచనముల బల్కనివాడు మూగ.

నిష్కామమగునది దానము. పాపమునుండి మరల్చువాడు మిత్రుడు. శీలమలంకారము. వాక్కునలంకరింపజేయునది యలంకారము.

విద్వన్మనోహరాకా సత్కవితాబోధవిరతాచ।
కం నస్పృశతి విపత్తిః ప్రబుద్ధవచనానువర్తినందాన్తమ్॥

జ్ఞానప్రబోధ, సత్కవిత విద్వన్మనోహరమగునవి. పెద్దలమాటలయందు లక్ష్యము నుంచిన వానిని, ఇంద్రియనిగ్రహవంతుని ఆపదలంటవు.

మహాభారతమున యక్షుడడిగిన ప్రశ్నలకు ధర్మరాజు సమాధానములు కూడ శంకరవచనములనే బోలియుండుట చూతము. ఇపుడు అట్టి శ్లోకములను కొన్నిటిని చూతము.

మనో యమ్యనశోచన్తిసద్భిస్సంధిర్నజీర్యతే (భారతమ్)
కేనాశోచ్యః పురుషః ప్రణతకలత్రేన ధీరవిభవేన।

ఇహభువనే కఃశోచ్యః సత్యపివిభవే నయోదాతా॥

దుఃఖమునందని వాడెవడు? అనుకూలవతియగు భార్య, నిలకడగల సంపదగలవాడు. ఈ లోకమున దుఃఖమునొందు వాడెవడు? సంపదకలిగియు దానగుణము లేనివాడు.

భారతమందలి యీ శ్లోకమున యీ భావమునే జూతము.
దేవతాతిధిభృత్యానాం పితౄణామాత్మనిశ్చయః।
ననిర్వపతిపంచానా- మచ్ఛ్వసన్నసజీవతి॥

దేవతలు, అతిథులు, భృత్యులు, పితృదేవతలకు సమర్పించక, తానును అనుభవించక జీవించియుండువాడు మృతతుల్యుడగును.

పుత్ర ఆత్మామనుష్యస్య భార్యాదైవకృతః సఖా। (భారతమ్)
పుత్రుడు మానవునకాత్మ. భార్య దైవమొసగిన మిత్రునివంటిది.
కింస్విదస్య పరాయణమ్? దానమస్యపరాయణమ్। (భారతమ్)
ప్రధానకర్తవ్యమేది? దానమే ప్రధానకర్తవ్యము. మఱియొక ఉదాహరణ .-
కింసమ్పాద్యం మనుజైః విద్యావిత్తంబలంయశంపుణ్యమ్।
కః సర్వగుణనాశీలోభః శత్రుశ్చ కః కామః॥

మానవుడు సంపాదింపతగినవి - విద్య, విత్తము, బలము, కీర్తి, పుణ్యము. సర్వగుణ వినాశకరమగునది లోభము. కామము మనకన్నివిధముల శత్రువు అని జగద్గురువులు బోధించినారు.

ఈ భావమునే భారతమందలి యీ శ్లోకములో జూతము.
క్రోధః సుదుర్జయః శత్రుః లోభో వ్యాధిరనంతకః।
సర్వభూత హితః సాధుః అసాధుర్నిర్దయః స్మృతః॥

క్రోధము జయింపశక్యముగాని అంతఃశత్రువు. ఆశ అంతులేని రోగము సకలప్రాణులమేలుకోరువాడే సజ్జనుడు. దయలేనివాడే దుర్జనుడు.

ప్రశ్నోత్తర రత్నమాలికయందు చివఱగా రెండుశ్లోకముల భావమును జూతము.

గృహమేధినశ్చ మిత్రంకిం భార్యాకోగృహేచయో జయతే।
కోయజ్ఞోయః శ్రుత్యా విహితః శ్రేయస్కరోనృణామ్॥

గృహస్థునకు భార్యహితము గూర్చునది. యాగములనొనర్చువాడు గృహస్థు. వేద విహితమును శ్రేయస్కరము అగునది యజ్ఞము.

ముక్తింలభతే కస్మాత్ ముకున్దభక్త్యా ముకున్దః కః
యస్తారయేదవిద్యాం కాచావిద్యాయతాత్మనోఽస్ఫూర్తిః॥

ముకున్ద భక్తివలన ముక్తిలభించును అవిద్యను దాటించువాడు ముకుందుడు. ఆత్మప్రకాశమునడ్డగించునది అవిద్య.

'ప్రశ్నోత్తరమణిరత్నమాల' యందలి కొన్ని శ్లోకముల భావమిపుడు జూతము.

కింభూషణా ద్భూషణమస్తిశీలం
తీర్థం పరంకిం స్వమనోవిశుద్ధమ్।
కిమత్రహేయం కనకంచకాన్తా
శ్రావ్యం సదాకింగురువేదవాక్యమ్॥

అలంకారములకే యలంకారమగునది శీలము. నిర్మలమగు మానసతీర్థము శ్రేష్ఠమైనది. కాంతాకనకములు త్యజింపదగినవి. గురువుల బోధలు, వేదవాక్యములు సదావినదగినవి.

శివకేశవ భక్తి ప్రియమైనది. దోషరహితమైనదే నిజమగు జీవితము. బ్రహ్మజ్ఞానమునొసంగునదే విద్య. ముక్తిదాయకమగునది బోధ. ఆత్మలాభమే లాభము. తన మనస్సును జయించినవాడు జగత్తునే జయింపగలడు. మదనశరవ్యథితుడు కానివాడు శూరుడు. సర్వకాల సర్వావస్థలలోను శాస్త్రాధ్యయనమును, ధర్మానుష్ఠానమును చేయవలెను. స్త్రీల మనస్సు, శీలము అందరికి ఎరుగరానిది. విద్యావిహీనుడు పశువు. తగిన సమయమునయథార్థమును పలుకని వాడు మూగ. హితవాక్యములు విననివాడు బధిరుడు. ఈ విధముగ మణులు, రత్నములవంటివియును, మృదు మధురములునయగు సందేశముల నిందు యొక మాలగ సమకూర్చి ఆత్మజ్ఞానమును భగవత్పాదులు పెంపొందింపజేసిరి.

చివరగ యీ మణిరత్నమాల యందలి యీశ్లోకమును జూతము.

పశోః పశుః కోనకరోతి ధర్మం
ప్రాచీన శాస్త్రేఽపిన చాత్మబోధః।
కిం తద్విషంభాతి సుధోపమంస్త్రీ
కేశత్రవో మిత్రపదాత్మజాద్యాః॥

ధర్మానుష్ఠానమొనర్పనివాడు, ప్రాచీన శాస్త్రములవలన ఆత్మజ్ఞానము నొందజాలనివాడు పశువులలో కెల్లపశువు. విషమయ్యును అమృతమువలె తోచునది స్త్రీ. మిత్రులవలె కనిపించు పుత్రాదులు శత్రువులు.

ఆదిశంకరులీవిధముగ మానవులలో వివేకజ్ఞానమును దీపింపజేయుటకు ప్రశ్నోత్తర రూపముగ 66 శ్లోకములతో 'ప్రశ్నోత్తరమణిరత్నమాల'ను రచించినారు. ఈ ప్రశ్నోత్తరములను నిరంతరము పఠించువారును, లేక వినువారును నిర్మల మనస్కులై పాపచింతనలేక సుఖమయమగు జీవనము గడుపువారగుదురనుటలో సందేహములేదు.

ఘటకుడ్యాదికం సర్వం మృత్తి కామాత్రమేవహి।
తద్వత్ బ్రహ్మజగత్సర్వమితవేదాన్త డిండిమః॥

బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవనాపరః।
ఇదమేవతు తచ్ఛాస్త్రమితి వేదాన్త డిండిమః॥

'బ్రహ్మజ్ఞానావలీమాలా' యను పేరున శంకరులు కొన్ని శ్లోకములను రచించిరి. అందలి యీ రెండు శ్లోకములభావము.

కుండ, గోడ మున్నగునవన్నియు మట్టియేకద. అవిఘట, కుడ్యాదిరూపమున గోచరించుచున్నను వాస్తవమునకు వానిస్వరూపము మృత్తికయేయని, ఈ జగత్తు బ్రహ్మస్వరూపమని, బ్రహ్మసత్యము, జగత్తుమిథ్య, జీవుడు బ్రహ్మమే, బ్రహ్మము నుండి వేఱుగాదుయని యనేక వేదాంత చర్చలలో నిరూపించిరి. అన్యమతములను ఖండించి దేశమున నలువైపుల అద్వైత పీఠముల నెలకొల్పిన ఘనత శంకరులదే.

అఖండము, అపారమునగు ప్రజ్ఞానమునందిచి సుఖశాంతులతో ఎల్లరు జీవించుట కింతటి యున్నతమైన మార్గమును జూపిన యాదిశంకరుల నెల్లరు నిరంతరము మరుపకూడదు. వారి వాఙ్మయమునందరు పఠించుచుండవలెను.

చివఱకు జగద్గురు విరచిత నిరంజనాష్టకమునుండి యీ భక్తిశ్లోకము ·

అధోనచోర్ధ్వం నశివో నశక్తిః
పుమాన్ ననారీ నచ లింగమూర్తిః।
బ్రహ్మోన విష్ణుర్నచదేవరుద్ర
స్తస్మైనమో బ్రహ్మనిరంజనాయ।

ఇతిశమ్

సర్వేభద్రాణి పశ్యంతు

# విముక్తికోసం

జి. శ్రీశైలం

ఆగడం చిక్కుల్లో పడేసే
అపవిత్రతనుంచి
మలమూత్ర [illegible]నాదుల
బెడదలే[illegible] స్థాయి
కాకు కావాలి.
అంటే ఈ జీవితంనుంచి
విముక్తి కలగాలి
అందుకు నాకు [illegible]ర్గం
మృత్యుమ[illegible]త
వాడిలోకి చేరుకోవడమే
అనురాగ ఖర్మలున్నాయి
వాటిని అదేవుడికే
వదిలేస్తున్నాను
నావల్ల కష్టం నష్టం ఈ లోకానికి
జరగకూడదని, నేను లేకుంటే
మేలు చేకూరుతుందని అంటే
సత్వరం నాజీవితాన్ని
త్యాగం చేస్తాను.
ఓ దేవా! నన్ను కరుణించు.
ఓ దేవా! నన్ను కరుణించు.

# ఋషి

-- శ్రీమతి రమాశంకర కొరిడె

నీలి నింగి నీడలా
పుడమితల్లి ఒడిలో
గాలి నీరు తోడుగ
జాలి కారు మోడతదు

తరువుల దాపులే
అతనికి పరుపులు
ఫలము జలము తీర్చు
ఆతని ఆకలి దప్పులు

జీర్ణపత్రములే
శీతలఘాత దీర్చు ఇంధనాలు
శిథిల వస్త్రలే
తనువు కాచుధనాలు

ఆతని దృక్కు లెపుడు
శూన్యపు దిక్కులు
అతని వాక్కునుండి రాలు
అసమాన్యపు సూక్తులు

జడలు కట్టిన దీర్ఘశిఖ
సూటైన దృఢ నాసిక
మెరిసిపోవు ఫాలభాగం
వేషము మార్చిన ఈశుడేమో ఈతడు

# వర్షఋతు ప్రాధాన్యత

-- హరి నాగేశ్వరశర్మ

సంవత్సరములోని ఒక్కొక్క మాసమునకొక ప్రత్యేకతయుంటుంది. చైత్రవైశాఖ మాసములు మధుమాసములు. వసంత ఋతువు. ఇంతకుముందు శిశిరంలో ఆకులు రాలిపోయిన చెట్లు చిగిర్చి పూవులతో నిండ ఈ మాసములలో వసంతశోభతో హృదయాహ్లాదమును కలిగించుచుండును. అంతేగాక యీ వసంతకాలమున అవతారపురుషుడగు శ్రీరామచంద్రు డవతరించి పితృవాక్య పరిపాలనాదక్షుడై, శత్రుసంహారము గావించి యుగయుగాలకు మరువరాని రామరాజ్యమును నెలకొల్పి అందరి చేతను ఆరాధింపబడుచున్నాడు

ఇంక ఆషాఢమాసమునందు వర్షములు ప్రారంభమగును. ఈ వర్షములు ఆశ్వయుజమాసము వఱకు పడుచుండును. వర్షములు కుఱియుటవలన పనులన్నిటికి తీవ్రమగు ఆటంకమేర్పడును. అందరును తమ తమ పనులను ఆపుకుని గృహములందే యుండవలసివచ్చును. ఈ నాలుగు మాసములలోను శ్రావణ, భాద్రపద మాసములందు వర్షములధికముగా కురియును.

ప్రవంత్యస్మిన్ మేఘాఇతి శ్రావణ్యా

మేఘములధికముగా వర్షించుటచే ఈ మాసమునకు శ్రావణమను పేరువచ్చినది.

ఇప్పటివరకు గ్రీష్మతాపముచే బాధపడి ఈ మాసమున వర్షములు కురియుటచే తాపోపశమనమునొంది ప్రాణులందరు ఆనందానుభూతి నొందుచున్నారు. తమ తమ క్షేత్రములను దున్ని వరి మొదలగు పంటలను నాటుకొనుచున్నారు.

మహాకవి కాళిదాసు ఋతుసంహారమను కావ్యమున వర్ష ఋతువు నీవిధముగ వర్ణించినాడు.

తడిల్లతాశక్రధను ర్విభూషితాః
పయోధరాస్తోయ భరావలంబినః।
స్త్రియశ్చకాంచీమణి కుండలోజ్వలా
హరన్తిచేతో యుగపత్ప్రవాసినామ్॥

మెఱుపు తీగలతోను, ఇంద్రధనుస్సులతోను కూడినవియు నీటిభారముచే వ్రేలాడుచున్నవియునగు మేఘములును, నడుమున వడ్డాణములతోను, చెవులకు మెఱయు బంగారు ఆభరణములతోను విరాజిల్లు స్త్రీలును ఒకేసారి బాటసారుల మనసుల నాకరించుచుండిరి.

శిరోరుహైః శ్రోణితటావలంబిభిః
కృతావతంసైః కుసుమైః సుగధిభిః।
స్తనై స్సహారై ర్వదనైః ససీధుభిః
స్త్రియోరతిం సంజనయన్తి కామినామ్॥

నడుములవరకు జాలువాఱు కేశపాశములచేతను, కర్ణాభరణములచేతను, మంచి పరిమళములను వెదజల్లు పుష్పములతోను, ముత్యాలహారములతో కూడిన స్తనభారములచేతను, సురాపానము జేసిన వదనములచేతను స్త్రీలు కాముకులకు కోరికలు బుట్టించుచున్నారు.

బహుగుణరమణీయః కామినీచిత్తహారీ
తరువిటపలతానాం బాంధవోనిర్వికారః।
జలద సమయ ఏషః ప్రాణినాం ప్రాణభూతో
దిశతు తవహితాని ప్రాయశోవాంఛితాని॥

ఎన్నో విధముల రమణీయమైనది, స్త్రీలచిత్తముల హరించునది, తరులతాదులకు గ్రీష్మతాపమునుండి విముక్తికలిగించు బంధువువంటిదియు, ప్రాణులకు ప్రాణసదృశమైనదియు నగు వర్షఋతువు నీకుహితములగు కోర్కెల దీర్చుగాకయని శ్లోకభావము.

ఇట్టి వర్షఋతువు శ్రావణమాసమునుండి ప్రారంభమగుచున్నది. అధికవర్షపాతమువలన కాలువలు, నదులు, చెఱువులు ఉప్పొంగి ప్రవహించును. ఒక్కొక్క ప్రదేశమున కట్టలుతెగి పొలములు గ్రామములు కూడ జలమయమగుచున్నవి. సస్యనష్టము, ఆస్తినష్టముకూడ సంభవించుచుండును. ఏదైన మితముగా నున్నదే ఉపయోగము. మితిమీఱిన అనర్థము గలిగించునుగద.

ఇపుడీ శ్రావణమాస ప్రాశస్త్యమును తెలిసికొందము.

శ్రవణానక్షత్రయుక్తా పూర్ణిమా ఽ స్మిన్నితి శ్రావణః.

'శ్రవణ' నక్షత్రముతో గూడిన పున్నమదీనియందు గలదు గనుక ఈ మాసమునకు 'శ్రావణ'మను పేరువచ్చినది.

ఈ శ్రవణశబ్దము అశ్విన్యాది నక్షత్రములలోని ఒక నక్షత్రముయొక్క పేరేగాదు శ్రవణమనగా వేదము.

శ్రుతిః స్త్రీ శ్రవణం శ్రవః (అమరకోశము)

శబ్దగ్రహణముజేయునది శ్రవణము. దీనికే 'శ్రుతి' యని పేరు.

శృణోత్యనేన శ్రోత్రం - శ్రుతిః

దీనిచే వినుచున్నారు గనుక 'శ్రోత్ర'మని, 'శ్రుతి'యని యనుచున్నారు.

వేదే శ్రవసిచ శ్రుతిః
శ్రూయతే ధర్మాధర్మాదిక మనయేతి శ్రుతిః

దీనిచే ధర్మాధర్మములు వినబడును గనుక శ్రుతియని పిలువబడుచున్నది.

విదంత్యనేన ధర్మాధర్మావితి వేదః.

దీనిచే ధర్మాధర్మములను తెలుసుకొనుచున్నాము గనుక 'వేదః' యని చెప్పబడుచున్నది.

కావున ధర్మాధర్మములను తెలియజేయునది వేదము, శ్రుతి లేక శ్రవణము.

ఈ వేదము ఋగ్యజుస్సామలను పేర్లతో త్రయీరూపముగ నున్నది.

ఋక్సామయ జుషీ ఇతి వేదాస్త్రయః త్రయీ
ఋచ్యంతే దేవాః అనయేతి - ఋక్

(ఋచ స్తుతౌ) దేవతలు దీనిచేత స్తోత్రము చేయబడుదురు గనుక ఈ వేదము 'ఋక్' అని పిలువబడుచున్నది.

స్యతి పాపమితి - సామ

పాపమును నశింపజేయునది సామవేదము

ఇజ్యంతే అనే నేతి - యజః

(యజదేవపూజా సంగతి కరణ దానేషు) దేవతలు దీనిచే పూజింపబడుదురు గనుక ఇది యజుర్వేదము.

పూజలచేతను, స్తోత్రములచేతను దేవతల నారాధించిన పాపము నశించునని ఈ మూడు వేదార్థములు తెలియజేయుచున్నవి.

కనుకనే 'స్వాధ్యాయోఽధ్యేతవ్యః' అని చెప్పబడినది. ఈ వేదాధ్యయనము ఉపనయనము చేసుకున్న బ్రహ్మచారులచే శ్రావణపూర్ణిమ రోజున ఉపాకర్మ (మౌంజీవిసర్జన) అయిన తరువాత ప్రారంభించబడుచున్నది. అసలు 'ఉపనయన' అను పదమున కర్థమే వేదమునకు సమీపమునకు వెళ్ళుటయని. ఉపనయనము జరుపుకున్నపుడు యజ్ఞోపవీతమునకు (మౌంజి) జింకచర్మము కట్టుదురు. ఆ రోజునుండి బ్రహ్మచారులు త్రికాల సంధ్యోపాసన, అగ్నింకార్యం చేయాలి. శ్రావణపూర్ణిమరోజున మౌంజీవిసర్జన గావించి వేదాధ్యయనమును ప్రారంభించవలెను. శ్రావణపూర్ణిమ రోజున బ్రహ్మచారులు, గృహస్థులుకూడ నూతన యజ్ఞోపవీతధారణ విధిగా చేయాలి, వేదాధ్యయనముకూడ చేయాలి. కనుకనే *(సశేషం)*

# సంక్షిప్త రామాయణమ్

రచన, కూర్పు : రుద్రావఝుల రామకృష్ణారావు

అదేవిధంగా మనం శ్రీరంగనాథ రామాయణము ద్విపదకావ్యము అధ్యయనముచేసినచో "కథాప్రారంభము"నందు సంక్షిప్తముగా కథను ఎంత సూక్ష్మీకరించి వివరించారో చదివితీరవలసిందే.

శ్లో॥ చరితం రఘునాధస్య శతకోటి ప్రవిస్తరమ్।
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్॥

"కౌసల్యకానంద కరుడట్టిరాము
నాసక్తియౌవరాజ్యాభిషిక్తునిగ
బట్టంబుగట్ట భూపతి సమకట్ట
గట్టడికైక సంగరమునదొల్లి
రెండు వరంబులర్థించినదౌట
జండించి కాననస్థలికి రాఘవుని
బనిచిన జనకుని ప్రతినకైపూని
జనకజా లక్ష్మణ సహితుడైవెడలి
దేవనంబునను నెంతేవనంబునను
బావనిమునిచర్య బరగుసంయముల
గరుణమైగాపాడి ఖరదూషణాది
శిరములు శరముల జెందు జెండాడి
ఋష్య మూకంబున నినజుజేపట్టి
వశ్యతనొకకోలవాలి దూలించి
సీతకై చలపట్టి సేతువుగట్టి
పాతకదశకంఠు పదితలల్గొట్టి
సీతతోగూడియాశ్రితలోకపారి
జాతంబువనచరజాతంబు గొలువ
నింద్రాది వినుతుడై యేతెంచిరామ
చంద్రుండు నిజపూజ సామ్రాజ్యలక్ష్మి
బాలించుచున్నాడు ప్రజలకు వేడ
గీవించుచును గృతకృత్యుడైయనుచు
నారామచరిత మాద్యంతంబు చెప్పి

నారదముని పోయె నలినజుపురికి||(శ్రీరంగనాథరామాయణము, పేజీ 5, సి.వి. కృష్ణా బుక్‌డిపో ప్రచురణ)

ఇదేవిధంగా వ్రాయడం ఆరంభిస్తే అది ఒక బృహద్గ్రంధమే అవుతుంది. అయినా రామకథని ఏదో ఒక విధంగా చదువుకోవడం, పాడుకోవడం, చర్చించుకోవడం, భజనచేయడం ఈ కలికాలంలో మనం చేయగలిగిన అతి సులభమైన ప్రక్రియ.

మన నిత్యపారాయణ శ్రీరామరక్షాస్తోత్రమ్‌లోని ముమ్మారు చదివేశ్లోకం.

శ్లో|| రామాయ రామభద్రాయ రామచంద్రాయవేధసే।
రఘునాథాయ నాథాయ సీతాయః పతయేనమః||

తా|| "రామా, రామభద్రా! రామచంద్రా। విధాతృస్వరూపా, రఘునాథా। ప్రభూ, సీతాపతివి అయిననీకు నమస్కారము."

అలాగే ఆ స్తోత్రం ముగింపులోకూడా ముమ్మారు చదివేశ్లోకం.

శ్లో|| శ్రీరామ రామ రామేతి రమేరామే మనోరమే।
సహస్రనామ తత్తుల్యం రామనామవరాననే||

తా|| (శ్రీ శంకరుడు పార్వతీదేవితో ఇట్లు పలుకుచున్నాడు)

"ఓ సుముఖీ! రామనామము విష్ణుసహస్రనామతుల్యమైనది. నేను సర్వదా రామ, రామ, రామ అని ఈ ప్రకారముగా మనోహరమైన రామనామమునందే రమించుచుందును."

క|| జలజాక్ష! భక్తవత్సల।
జలజాసన వినుతపాద జలజాత! సుధా
జలరాశి భవ్యమందిర
జలజాకర చారుహంస! జానకినాథాః||

(మొల్లరామాయణము, బాలకాండము 99)

# శివరాత్రి కైవల్యము

రచన : సమర్పణ : "సహజకవితాసరస్వతి" జిల్లెపల్లి భాస్కరరావు

జాగరణము నుపవాసము
సొగసౌ బిల్వార్చనము శుభమభిషేకం
బాగగు దీపారాధన
వేగాన శివరాత్రివ్రతము వేద్దు శివాత్మా॥

అమరారామము భీమరామము సుక్షీరారామ ద్రాక్షారముల్
సమతుల్యంబు కుమారరామముననే సాకార లింగార్చనల్
విమలోద్భాత వివేక బిల్వములతో విజ్ఞాన పంచామృతాల్
శుభాసితములౌ సాన్నిర్దీప సౌందర్యముల్॥

కంచిని పృథ్వి లింగమయెగా, జలలింగము జంబుకేశమున్
మించెను నగ్ని లింగమయమే యరుణాచలసీమ, వాయుసా
మంచితకాళహస్తి హృదిమార్గము లింగజగత్తు నిండుచున్
పెంచె చిదంబరంబునను, ప్రేమపథంబు శివార్చనంబుగన్॥

కేదారేశ ఘృణేశ్వరశ్శివ మహాకేళీకాళ నాగేశ్వరాన్
బైద్యానాథుని మల్లిఖార్జునమతిన్ భాసించు రామేశ్వరున్
సర్వస్ఫూర్తిని సోమనాథు నమలేశ్వు భీము సంసేవనన్
విద్యన్పొందు త్రయంబకే శ్వరుమహావిశ్వేశ్వర్యదీక్షతో॥

శివరాత్రి నుపవసించుచు
నవరుచి పంచామృతమ్మునభిషేకములన్
భవమలర దీపముంచుచు
గవయగ బిల్వార్చనంబు గావింపనగున్॥

రాతిరి జాగరణమ్మున
చేతనమౌ శైవశక్తి చేరిచి ప్రేమన్
యాతనలారగ సమహిత
మాతత దివ్యాత్మశక్తి నుసలరె భువిపై॥




ఆలయములు వేరైనా ఆరాధకుడొక్కడే. మతాలు వేరైనా ఆశయం ఒక్కటే.

మానవతే మానవుని ప్రథమ కర్తవ్యం.

**BOOK POST** **Printed Matter**



To

Smt. & Sri

48. SRI.DR.B.RAMA RAJU
1-8-117/2,
Chikkadpalli,
HYDERABAD - 500 020.